ద్వితీయ కుసుమము.



# ద్రవిడాంధ్ర తిరుప్పావు.




ర చ యి త లు

ఆ ం డా ళు

తి. కం. తిరువేంగడాచార్యులు





ప్ర కా శి క :

వి జ య ని శ్రీ జీ గ్ర ం థ మా ల

చి త్తూ రు .

హేవిళంబి సంక్రాంతి] 1958. [వెల 0—6—0.

భక్తవరులారా, రసికులారా

నేను చిన్నతనమునుండియుఁ గవిత్వరచనకై యుబ్బాటపడువాడను. చిన్నచిన్న పద్యము లల్లుట కప్పుడప్పుడు ప్రయత్నించుచుండెడివాడను. శ్రీనాథాదుల చాటువులు నాకుఁ బ్రోత్సాహ మొసఁగెడివి. చూచిన దృశ్యమునెల్ల పద్యమున నిముడ్పవలయు ననిపించెడిది. కాని నాశక్తి వెనుకకులాగుచుండెను. అట్లే వేంకటేశ్వర శతకమును రచించితిని.

[illegible]

తుదకు ఖండకావ్యరచన, అందును అనువాదరచన సాగింపవచ్చునని తోచినది. ముకుందమాల ననువదించితిని. తరువాత మఱల నవకాశము చిక్కదయ్యెను. కలాశాలవిద్య పూర్తియై జీవికాన్వేషణముతో తెలంగాణమునందు తిరుగులాడవలసివచ్చెను. 1933 వ సంవత్సరమున శ్రీవ్యాసాశ్రమ సంస్కృతపాఠశాలయందుఁ బ్రధానపండితపదవి లభించుటతో జీవికావిషయకమగు విచారము తగ్గి కొంతతీరిక లభించెను.

ఆ సమయముననే మద్రాసునందలి ద్వారకానాథసేవామండలివారు తిరుప్పావు అనువాదపుపోటీ నేర్పఱచిరి. ఆ సందర్భము నా కమితోత్సాహమును గూర్చెను. ఆ సమయమున నేనీ గ్రంథమును వ్రాసి పంపగా వారు దీనికి రెండవ బహుమతి నొసఁగిరి. కాని యింతవఱకును దీనిని బ్రచురించుటకు వీలుకలుగదయ్యెను.

ప్రస్తుతము భక్తిరసబంధురమగు నీ గ్రంథమును విజయనిశ్రేణిగ్రంథమాలా ద్వితీయకుసుమముగా వెలువరించుచున్నాను.

అందును మూలమును కుడివైపునను నాయనువాదమును ఎడమ వైపునను ముద్రించితిని. ఇందుచే తిరుప్పావును అనుసంధించు

ారికి సౌకర్యముగనుండును, పాశురముభావమును తెనిసికొనుటకు ్రనేయున్న పద్య ముపయోగించును. ఆంధ్రతిరుప్పావును చదువు ువారికిని సౌకర్యముగానుండును.

సహృదయులు ఇందలి విషయగౌరవమును పురస్కరించు ొని దీని నాదరింతురు గాక! ఇది ద్రవిడాంధ్రసోదరుల యైక మత్యాదరములకుఁ బాత్రమగుఁ గాక!

భక్తులును రసికులును ఈ గ్రంథమాలయందుఁ జందాదారు లుగఁజేరి చేయూత నొసంగఁ బ్రార్థించుచున్నాను,

ఇట్లు,
విద్వద్విధేయుడు,
తి. కం. తిరువేంగడాచార్యులు,



# ఆండాళు చరిత్రము.

---

భగవత్తత్వమును తా మనుభవించి చేతనులచే ననుభవింపఁజేసి వారిని ఉత్తరింపఁజేయుటకై ఋషులకన్ననుత్తములగు నాళ్వారులు అవతరించిరి. అందు పెరియాళ్వారని వ్యవహరింపబడు విష్ణుచిత్తులు శ్రీవిల్లిబుత్తూరునందు నివసించుచు ఆ క్షేత్రమున వేంచేసియుండు వటపత్రశాయికి పుష్ప కైంకర్య మొనర్చుచు దాని కంగముగ మల్లెలు

మొల్లలు, విరజాజులు, తులసి మొదలగు వానిని నాటి యా తోటలో నిత్యమును కృషిచేయుచు చిత్ర విచిత్రముగ పుష్పమాలికలు కట్టి స్వామికి సమర్పించుచు వర్తించుచుండిరి. సామాన్య శాస్త్ర జ్ఞానము నయితములేని యా విష్ణుచిత్తుఁడు భగవత్ప్రేరణచే, భగవదనుగ్రహముచే నారాయణపరతత్త్వనిర్ణయముచేయగా పందెముగట్టిన మూట తనంతట యూడి వారి ముందుపడెను. వారు విజయోత్సవముతో వచ్చుచుండఁగా భగవంతుఁడు సాక్షాత్కరించిరి. వారు అప్పుడు పల్లాండుపాడి పెరుమాళ్ళకు మంగళాశాసనమొనర్చి పెరియాళ్వారను ప్రసిద్ధిగాంచిరి.

అట్టి విష్ణుచిత్తులు తులసీబృందావనమున నొక తులసి వృక్షము క్రింద త్రవ్వుచుండఁగా కలియుగము 98 నళ సంవత్సరము కర్కాటమాసమున శుద్ధ చతుర్దశి మంగళవారమున పుబ్బ నక్షత్రమున తులసీమూలమున నొక బాలిక లభించెను. వారు ఆమె భూదేవి యంశము గలదని భావించి గోదాదేవి యనియు, అండాళనియు పేరులుంచి పుత్రికావాత్సల్యముతోఁ బోషించుచుండిరి. అండాళు దినదినాభివృద్ధిగాంచుచు పుష్పమాలాకైంకర్యమునందు తండ్రికి తోడ్పడుచుండెను. పెరియాళ్వారు పుష్పమాలికలు కట్టి బుట్టయందుంచి యనుష్ఠానాదులకు వేంచేయునప్పుడు అండాళు ఆ మాలికలు ధరించి తాను శ్రీరంగనాథునకు తగియుందునా యని యద్దమునందుఁ జూచుకొని మరల వానిని బుట్టయం దుంచుచుండెను. పెరియాళ్వారు ఆమాలికలను పెరుమాళ్ళకు సమర్పించుచుండిరి.

ఇట్లు కొన్నాళ్లు గడువగా నొకనాడు పెరియాళ్వారు తన కూతురుచేయుచున్న యీ యాగడమును స్వయముగా గమనించి ఆమెను కోపగించి, యానాడు స్వామికి మాలిక లర్పింప బోకుండెను. కాని ఆరాత్రి పెరుమాళ్లు పెరియాళ్వారునకు స్వప్నమున సాక్షాత్కరించి అండాళు ధరించుటచే పరిమళమతిశయించిన మాలికలే తన కిష్టమనియు, నట్టి వానినే సమర్పింపుమనియు కోరెను. అంతట

పెరియాళ్వారు ఆండాళు ప్రభావమున కాశ్చర్యపడి యామె ధరించిన మాలికలనే పెరుమాళ్ళ కర్పించుచుండెను.

ఆండాళు భగవత్సంశ్లేషమును గోరినదై గోపికలాచరించిన వ్రతము ననుకరింపనెంచినదై శ్రీవిల్లిపుత్తూరే వ్రేపల్లెగను, అచటి కన్యలే సఖులుగను, వడపెరుంగోయిలలోని స్వామిసన్నిధియే నందగోపగృహముగను, వటపత్రశాయియే శ్రీ కృష్ణుఁడుగను, తానే యుత్తమగోపకన్యకగను భావించి తిరుప్పావుపాడి యనుభవించినది. మఱియు నామె నాచ్చియార్ తిరుమొழி యను ప్రబంధము నానతిచ్చి భగవద్గుణానుభవమునందే సంసక్తురాలయ్యెను.

పెరియాళ్వారు ఆమె భక్త్యతిశయమును గమనించి, వివాహయోగ్యమగు వయసును తిలకించి నూటయెనిమిది దివ్యదేశములందలి పెరుమాళ్ల గుణాతిశయములను వర్ణింపఁగా నామె వానినెల్ల విని శ్రీరంగనాథుని బెండ్లాడుటకు సమ్మతించెను. పెరియాళ్వారు ఈ వివాహమెట్లు జరుగునాయని విచారపడుచుండఁగా శ్రీరంగనాథుఁడే స్వప్నమున సాక్షాత్కరించి ఆండాళును తన కర్పింపఁగోరెను. మరియు నర్చకముఖమున తన యభీష్టము నెఱింగించి ఛత్రచామరాద్యుపకరణములతో ఆండాళును అతివైభవముగఁ బిలుచుకొనివచ్చుటకై తన పరివారము నంపెను. పెరియాళ్వారును మహానందమును జెంది ఆండాళును పల్లకిలోఁ గూర్చొనఁబెట్టికొని శ్రీరంగమునకుఁ దీసికొనివచ్చిరి. అచట కల్యాణోత్సవము జరిగిన తరువాత ఆండాళు స్వామిసన్నిధిలోఁ బ్రవేశించి నాగపర్యంకము నెక్కి శ్రీరంగనాథుని తిరువడిలో నంతర్భవించెను.

ఈ యాశ్చర్యమును అచటి ప్రజానీకమును, పెరియాళ్వారును, వారి శిష్యుఁడగు వల్లభదేవరాయఁడును కనులార దర్శించి యాశ్చర్యానందములను జెందిరి.

# గ్రంథ ప్రశంస.

---

దేహాత్మాభిమానులకును సామాన్యమానవులకును ఆత్మస్వరూపవేత్తలగు ఋషులకును పర్వతమునకును బరమాణువునకును గల తారతమ్యముగలదు. అట్టి ఋషులకును ప్రత్యక్షభగవదనుభవముగల ఆళ్వార్లకును అంతటి తారతమ్యముగలదు. తక్కిన యాళ్వార్లకును పెరియాళ్వార్లకునుని అంత వ్యత్యాసముగలదు. ఆ పెరియాళ్వార్లకును ఆండాళునకును అంత తారతమ్యముగలదు. భగవంతుఁడు తన్ను మేల్కొలుపవలసిన యవసరము లేకయే తానే యతనిని మేల్కొలిపి తన కోరువలు విన్నవించుకొన్న యామె యాధిక్యమేమన వచ్చును! అట్టి భూదేవ్యంశసంభూతయు, నయోనిజయునగు నాండాళురచించి భగవంతుని లోఁగొనిన యీకృతి ప్రపన్నులకు నిత్యానుసంధేయము. ధనుర్మాసస్నానవ్యాజమున భగవత్సన్నిధికిఁబోయి "నీకుశేషమయిన యీయాత్మ చెడిపోకుండునట్లు స్వరూపానురూపమగు నిత్యకైంకర్యమును కృపచేసి ప్రోవుమా" యను ప్రార్థన యిందిమిడియున్నది.

తిరుప్పావున కనేక వ్యాఖ్యానములుగలవు. ఇది ప్రతిపదమధురము, రసభావతరంగితము, భక్తిపరీవాహ భరితము.

కాన భక్తాగ్రేసరులెల్లరును నిత్యమువనుసంధించుచు తరింతురు గాక !

ఇట్లు భాగవతదాసుడు,

**తి. కం. తిరువేంగడాచార్యులు.**

—◎ ० ◎—



శ్రీ



నామదిని నిల్పియుండి విన్నాణమెసఁగ
తెలుఁగునందుఁ దిరుప్పావుఁ బలికినట్టి
తల్లి కాండాళునకు భక్తి తళుకులొత్త
నర్పణముసేతు నీకృతి నంజలించి.

విద్యాప్రవీణ, విద్వాన్.

**తి. కం. తిరువేంగడాచార్యులు,**

చిత్తూరు.

శ్రీమతే రామానుజాయ నమః.

# తిరుప్పావై

## తనియలు.

శ్రీశైలేశదయాపాత్రం
ధీభక్త్యాదిగుణార్ణవం।
యతీంద్రప్రవణం వందే
రమ్యజామాతరం మునిం॥ 1

లక్ష్మీనాథసమారంభాం
నాథయామునమధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం
వందే గురుపరంపరాం॥ 2

యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే. 3

మాతా పితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానాం।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమ త్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా. 4

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యం॥ 5

శ్రీమతే రామానుజాయ నమః.

# ఆంధ్ర తిరుప్పావు.

## త ని య లు .

క॥ శ్రీశైలేశదయాస్పదు,
ధీశుద్ధుఁ బ్రపత్తిముఖ్యదివ్యగుణపయో
రాశి, యతీంద్రప్రవణుఁ, బ్ర
జాశరణముఁ గొల్తు రమ్యజామాతృమునిన్. 1

గీ॥ లక్ష్మినాథుఁడు మొదట వెలయుచునుండ,
నాథయామునులును నట్టనడుమ నుండ,
నస్మదాచార్యపర్యంతమయినయట్టి
గురులవరుసకు నతులు పెక్కులు రచింతు. 2

గీ॥ భగవదంఘ్రిసరోజసువర్ణమోహ
వశత నన్యములను గడ్డివలెఁ దలఁచుచు
నలఘుదయమించు రామానుజార్యుపదము
లొక్కటే శరణంబని మ్రొక్కులిడుదు. 3

గీ॥ తల్లి తండ్రియు నతివలుఁ దనయవరులు
సంపదయు నెల్ల మనవంశసరణికగుచు,
నాద్యగురువగు నానమ్మయాళువారి
వకుళవాసితాంఘ్రుల కివె వందనములు. 4

గీ॥ భూత కాసార మహదాఖ్య భూషితులను.
భట్టనాథయతీంద్రుల, భక్తిసారు,
భక్తపదరేణు, పరకాలు, వకుళభూషు.
యోగివాహుఁ గులశేఖరు నొగి నమింతు. 5

నీళాతుంగ స్తనగిరి తటీసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయంతీ।
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయఏవాస్తు భూయః॥ 6

అన్నవయల్ పుదువై యాణ్డాళరఙ్గఱ్కు,
ప్పన్ను తిరుప్పావై ప్పల్ పదిగ-మన్నిశై యాల్,
పాడిక్కొడుత్తాళ్ నఱ్పామాలై పూమాలై,
శూడిక్కొడుత్తాళైచ్చొల్లు. 7

శూడిక్కొడుత్తశుడర్కొడియే తొల్ పావై,
పాడియరుళవల్ల పల్ వళైయాయ్, నాడినీ
వేఙ్గడవఱ్కెన్నై విదియెన్ఱవిమ్మాఱ్ఱమ్,
నాఙ్గడవావణ్ణమేనల్గు. 8



ఉ॥ నీళయనుంగుచన్దరుల నిద్దురవోయెడు కృష్ణు లేప. వే
దాలతుదిన్ ప్రసిద్ధమగు ధర్మము శేషత విన్నవించుచున్,
దా లభియించి క్రొందురుముదార్చి సడల్చిన పూలమాలతో
మేలుగఁ గట్టి లోఁగొనెడి మెల్తుక గోదకు వేయిదండముల్. ౬

ఉ॥ అంచితధన్వినవ్యపురమందుఁ జనించియు, రంగనాథుపై
మించుగఁ దొల్లినోము నెలమిం దెలుపంగ ననేకగీతముల్
ప్రాంచదుదారరాగములఁ బాడి, సుమంబులమాల కొప్పులో
నుంచి యొసంగుగోద నిఁక నోమనమా స్తవముం బొనర్పుమా. 7

గీ॥ మొదలధరియించి యొసఁగిన మోహనాంగి!
తొలిప్రబంధంబు కృపసేయు నలఘువలయ!
వేంకటేశ్వరువారమై వెలయుకోర్కి
తలఁగిపోకుండ నిలుపవే! కొలుతు నిన్ను. ౮



మార్గఴి త్తిఙ్గళ్  మదినిఱైన్దనన్నాళాల్,
నీరాడప్పోదువీర్ పోదుమినో నేరిఴైయీర్,
శీర్ మల్గుమాయ్ప్పాడి శెల్వచ్చిఱుమియర్గాళ్,
కూర్వేఱ్కొడున్దొఴిల఩్ నన్దగోప఩్ కుమర఩్,
ఏరార్న్దకణ్ణియశోదై యిళఞ్జిఙ్గమ్,
కార్ మేనిచ్చెఙ్గణ్ కదిర్ మదియమ్పోల్ ముగత్తా఩్,
నారాయణనే నమక్కే పఱైదరువా఩్,
పారోర్ పుగఴప్పడిన్దేలోరెమ్బావాయ్.

  

వైయత్తువాఴ్వీర్గాళ్ నాముమ్నమ్బావైక్కు,
శెయ్యుమ్కిరిశైగళ్ కేళీరో పాఱ్కడలుళ్,
పైయత్తుయిన్ఱ పరమనడిపాడి
నెయ్యుణ్ణోమ్పాలుణ్ణోమ్నాట్కాలేనీరాడి,
మైయిట్టెఴుదోమ్మలరిట్టునాముడియోమ్,
శెయ్యాదనశెయ్యోమ్తీక్కుఱళై చ్చెన్ఱోదోమ్,
ఐయముమ్పిచ్చైయుమాన్దనైయుమ్కైకాట్టి,
ఉయ్యుమాఱెణ్ణియుగన్దేలోరెమ్బావాయ్.



సీ॥ మార్గశీర్షపు పూర్ణిమాతిథి, నీరాడ
రాఁగోరువారు వే రండురండు,
దివ్యభూషాప్రసాధితగోపబాలలా
రా! మనకెల్ల నారాయణుండు,
దీప్తాయుధుఁడు, దండతీవ్రుఁడు కఱిమేని,
వీరసింహుఁడు, సూర్యవిధుముఖుండు,
నందగోపకమనోనందనుండు, విశాల
కమలాక్షుఁడు, యశోదగన్న బిడ్డ,

గీ॥ రక్షకుం డతఁడే కోర్కు లక్షయముగ
నిచ్చుచుండునుగావున నెవరు కృష్ణుఁ
జేరనీయరో వారును చేరునటుల
తగినమననోము నోమంగఁ దరలిరండు. 1

సీ॥ సర్వంసహాస్థితజనులార! మనదగు
వ్రతవిధానము హితమతి వినుండు,
పాలసంద్రంబులోపల జగద్రక్షచిం
తన యోగనిద్రలోఁదగులు పరము
పాదముల్ గొనియాడి పాలునేయియు మాని
వేకువ నీరాడ వెడలవలయు,
కాటుకపెట్టక, కలపూలుచుట్టక,
చేయరానిపనులు చేయఁబోక,

గీ॥ కొండెములుచెప్ప, కుపకారమొండు లిచ్చ
మొండు చేసైనయట్టుల నొసఁగి, యుత్త
రించు[illegible]వల నెఱిఁగి వర్తింతమెపుడు,
తగిన [illegible]ననోము నోమంగఁ దరలిరండు. 2

ఓఙ్గియులగళన్దవుత్తమన్ పేర్పాడి,
నాఙ్గళ్ నమ్బావైక్కుచ్చాఱ్ఱినీరాడినాల్,
తీఙ్గిన్ఱినాడెల్లామ్తిఙ్గళ్ ముమ్మారిపెయ్‌తు,
ఓఙ్గుపెరుఞ్జెన్నె లూడుకయలుగళ,
పూఙ్గువళైప్పోదిల్ పొఱివణ్డుకణ్పడుప్ప,
తేఙ్గాదేపుక్కిరున్దుశీర్త్తములైపఱ్ఱి,
వాఙ్గక్కుడమ్నిఱైక్కుమ్వళ్ళల్ పెరుమ్బశుక్కళ్,
నీఙ్గాదశెల్వమ్నిఱైన్దేలో రెమ్బావాయ్.

  

ఆఴిమఴైక్కణ్ణావొన్ఱునీకైకరవేల్,
ఆఴియుట్పుక్కుముగన్దుకొడార్త్తేఱి,
ఊఴిముదల్వనురువమ్బోల్ మెయ్‌కఱుత్తు,
పాఴియన్దోళుడైప్పఱ్పనాబన్కైయిల్,
ఆఴిపోల్ మిన్నిపలమ్బురిపోల్ నిన్ఱదిర్న్దు,
తాఴాదేశార్ఙ్గముదైత్తశరమఴైపోల్,
వాఴవులగినిఱ్పెయ్‌దిడాయ్‌నాఙ్గళుమ్,
మార్గఴినీరాడమగిఴ్న్దేలో రెమ్బావాయ్.



సీ॥ మిన్నంత యెదిగి పేర్మిని లోకముల నెల్ల
పదమునఁ గొలిచిన పరమపురుషు
నామముల్ పాడి, మనము నోమునకు నేక
మై తానము లొనర్చినట్టులైన,
నెలమూఁడువానలు నేలవర్షించి, యీ
తుల బాధలడఁగు, నందునను శాలి
భూముల మీనులు పొర్లఁగాఁ, గలువల
తుమ్మెదపిండు నిదురఁగొనంగ,

గీ॥ కొట్టములఁ బెద్దపొదుగుల నట్టెరెండు
చేతులంబిండ బానలుచిందునటుల
పాలనిచ్చెడి యాలసంపదలు పొదలు
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 3

సీ॥ వర్షదాయక! మేఘవర! కొంచెమైనను
నీశక్తి యొద్దనే నిలుపుకొనకు,
మబ్ధినీరంతయు నాపోశనమొనర్చి,
యంబరంబెల్లెడ వ్యాప్తిఁజెంది,
సకలకారణుఁడగు శౌరిదేహమువలె
మసృణనీలిమకాంతి నెసఁకమెసఁగి,
ఆజానుభుజుఁడగు నబ్జనాభునిచేతి
చక్రమురీతి నిచ్చలును మెఱసి,
పాంచజన్యమువలెఁ బలముగా నుఱుముచు
శారఙ్గముక్తాశుగసమితివోలె

గీ॥ ప్రాణులెల్లను జీవించి పరిఢవిల్ల
మేము మార్గశినీరాడ మెప్పుతోడ
జాగుసేయక వర్షింప నేగుదెమ్ము,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 4

మాయనై మన్నువడమదురై మైన్దనై,
త్తూయ పెరునీర్ యమునై త్తుఱైవనై,
ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ మణివిళక్కై,
త్తాయై క్కుడల్ విళక్కఞ్జెయ్ద దామోదరనై,
త్తూయోమాయ్వన్దునామ్తూమలర్ తూవిత్తొఴుదు,
వాయినాఱ్పాడిమనత్తినాఱ్చిన్దిక్క,
పోయపిఴైయుమ్పుగుదరువానిన్ఱనవుమ్,
తీయినిల్ తూశాగుమ్ శెప్పేలోరెమ్బావాయ్.

  

పుళ్ళుమ్శిలుమ్బినగాణ్ పుళ్ళరైయన్కోయిలిల్,
వెళ్ళైవిళిశఙ్గిన్ పేరరవఙ్గేట్టిలైయో,
పిళ్ళాయెఴున్దిరాయ్ పేయ్ములైనఞ్జుణ్డు,
కళ్ళచ్చగడమ్కలక్కఴియక్కాలోచ్చి,
వెళ్ళత్తరవిల్ తుయిలమర్న్దవిత్తినై,
ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్గళుమ్ యోగిగళుమ్,
మెళ్ళవెఴున్దరియెన్ఱ పేరరవమ్,
ఉళ్ళమ్బుగున్దుకుళిర్న్దేలోరెమ్బావాయ్.



సీ॥ ఉత్తరమధురకు నొడయఁడై, సుసలిల
యమునాతటవిహారహారి యగుచు,
గోపసంతతిమణిదీపమై వెలసిన
దామోదరుని పాదదాసులగుచు,
శుద్ధులమైవచ్చి, సొగసగుపూవుల
నతనిపాదయుగంబునందు నునిచి,
కైమోడ్చి, నోటఁ జక్కఁగఁ బాడి, యట్టులే
మనసునందున ధ్యానమును నొనర్ప,

గీ॥ పూర్వకృతములౌ పాపంపుప్రోవులట్లు
చేయఁబోయెడు దురితనికాయములును
అగ్గిఁబడుదూదిపోలిక నడఁగిపోవు,
తగినమననోమునోమంగఁ దరలిరండు. 5

సీ॥ పులుగులుఁ గలకలఁ బలుకుచు నేఁగెడి,
గరుడవాహాలయగర్భమునను
సితశంఖరావంబు చెవిఁబడలేదటే?
లేచిరమ్మా పిల్ల! లేచిరమ్మ.
పూతనాస్తనవిషపూరముఁ బీలిచి,
కాలను బండిని గూలఁదన్ని,
క్షీరవారాశిలో శేషశయ్యనుబండు
లోకబీజమును ముల్లోకములను

గీ॥ మునులు యోగులు మనసుల నునుచుకొనియు
మెల్లఁగాలేచి "హరి" యను మేటియఱవు
నామదినిదూరి మేలుకొనంగఁజేసె
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 6

కీశుకీశెన్ఱెఙ్గుమానై చ్చాత్తఙ్గలన్దు,
పేశినపేచ్చరవఙ్గేట్టిలైయో పేయ్ప్పెణ్ణే,
కాశుమ్పిఱప్పుమ్కలగలప్పక్కై పేర్త్తు,
వాశనఱుఙ్కుఴలాయ్చ్చియర్, మత్తినా
లోశై పడుత్త తయిరఱవఙ్గేట్టిలైయో,
నాయగప్పెణ్బిళ్ళాయ్నారాయణన్మూర్త్తి,
కేశవనై ప్పాడవుమ్నీకేట్టేకిడత్తియో,
తేశముడైయాయ్తిఱవేలోరెమ్బావాయ్. 7

  

కీఴ్వానమ్వెళ్ళెన్ఱెరుమైశిఱువీడు,
మేయ్వాన్పరన్దనగాణ్ మిక్కుళ్ళపిళ్ళైగళుమ్,
పోవాన్పోగిన్ఱారైప్పోగామఱ్కాత్తున్నై
క్కూవాన్వన్దునిన్ఱోమ్, కోదుకలముడైయ
పావాయెఴున్దిరాయ్ప్పాడిప్పఱైకొణ్డు,
మావాయ్పిళన్దానైమల్లరైమాట్టియ,
తేవాదిదేవనైచ్చెన్ఱునామ్శేవిత్తాల్,
ఆవావెన్ఱారాయ్న్దరుళేలోరెమ్బావాయ్. 8



సీ॥ కీచుకీచని యెందు నేచినగుంపులై
కూసెడుపులుఁగులకూఁత వినవె?
పిచ్చిపిల్లా! గాజు లిచ్చ గల్లలలాడఁ
సారె కాసారప్రసారములను
గోపికల్ తఱువంగ ఘూర్ణిల్లుఘుమఘుమ
ధ్వనియేని యింతకు వినఁగలేదె?
నారీమణీ! యీడ నారాయణుండగు
కేశవు మేము భక్తిమెయిఁబాడ

గీ॥ వినియె శయనించితో తెలివిగలదాన?
తలుపుతీయుము తీయుము త్వరితముగను,
వాకిటను మమ్మునిలుపఁగా బాగెనీకు?
తగిన మననోమునోమంగఁ తరలిరండు. 7

సీ॥ తూర్పువెల్వెలఁబారె, నేర్పున నెనుములు
లేఁతపచ్చిక మేయ లేచిపోయె,
నీవొక్కతెపుదప్ప నెల్లపిల్లలమేము
పోఁబోవువారిని పోవనీఁక
నినుబిల్చుటకువచ్చి నిలిచియుంటిమి, వ్రతా
చరణప్రియా! లెమ్ము, చక్కరమ్ము,
జంత్రములను బాడి చతురుఁ గేశిఘ్నుని
మల్లభంజను దేవతల్లజు హరిఁ

గీ॥ జేరి మనమెల్ల సేవలుసేయ నతఁడు
అయ్యయోపాపమని మదియందునెంచి
దయ దళుకులొత్త రక్షింపఁదలఁచుఁగాన
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 8

తూమణిమాడత్తుచ్చుఱ్ఱుమ్విళక్కెరియ,
త్తూపఙ్గమఴత్తుయిలణై మేల్ కణ్వళరుమ్,
మామాౝమగళే మణిక్కదవమ్తాళ్ తిఱవాయ్,
మామీరవళై యెఴుప్పీరో, వుౝమగళ్ దా
నూమైయోవన్ఱిచ్చెవిడోవనన్దలో,
ఏమప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో,
మామాయౝమాదవౝవైగున్దనెన్ఱెన్ఱు,
నామమ్పలవుమ్నవిన్ఱేలోరెమ్బావాయ్.

  

నోఱ్ఱుచ్చువర్క్కమ్పుగుగిన్ఱవమ్మనాయ్,
మాఱ్ఱముమ్దారారో వాశల్ తిఱవాదార్,
నాఱ్ఱత్తుఴాయ్ముడినారాయణౝ, నమ్మాల్
పోఱ్ఱప్పఱైదరుమ్పుణ్ణియనాల్, పణ్డొరునాళ్
కూఱ్ఱత్తిౝవాయ్వీఴ్న్దకుమ్బకరుణనుమ్,
తోఱ్ఱమునక్కే పెరున్దుయిల్ దాౝతన్దానో,
ఆఱ్ఱవనన్దలుడైయాయరుఙ్గలమే,
తేఱ్ఱమాయ్వన్దుతిఱవేలోరెమ్బావాయ్.



సీ॥ ఘనమణిమయసౌధగర్భంబునను చుట్టు
దీపముల్ వెలుఁగఁగా, ధూపసమితి
క్రమ్మఁగా, హంసతూలపుశయ్య నిదురించు
వదినా! కవాటము వడి తెఱువుము,
అత్తగారూ! మీరలైన నామె నొకింత
మేలుకొల్పఁగరాదె! మీతనూజ
మూగదో? చెవిటిదో? బాగుగ నిదురలో
నుండెనో? లేవనీకుంటిరొక్కొ?

గీ॥ గొప్పనిదురరా మంత్రంబుసెప్పఁబడెనొ?
అద్భుతానంతగుణుఁడగు హరి మరిమరి
తలఁచుచు ననంతనామముల్ పలుకవలయు,
తగిన మననోమునోమంగఁ దరలిరండు. 9

సీ॥ వ్రతముఁజేసిఁ త్రివిష్టపముఁబొందఁదగు తల్లి!
ప్రత్యుత్తరంబేనిఁ బలుకరాదె?
తలుపైనఁదెరువనె? తలుపుఁదీయనిమీకు
తులసీలసచ్ఛిఖుం డల మురారి
మా నుతులను గొని మాన్యార్థములనిచ్చు.
పుణ్యుఁడౌ రాముచేఁ బొలిసినట్టి
కుంభకర్ణుఁడు నీకుఁ గోమలి! తానోడి
గాఢనిద్రను కాన్కగా నొసఁగెనె?

గీ॥ యమితనిద్రాస్వభావ! యోయస్మదీయ
గోష్ఠికాభరణంబయికూర్చుబాల!
తెలివితోవచ్చి వాకిలి తెఱువవమ్మ!
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 10

కఱ్ఱుక్క ఱనైక్కణఙ్గళ్ పలకఱన్దు,
శెఱ్ఱాల్ తిఱలఴియచ్చెన్ఱు శెరుచ్చెయ్యుమ్,
కుఱ్ఱమొన్ఱిల్లాదకోవలర్ దమ్పొఱ్కొడియే,
పుఱ్ఱరవళ్ గుల్ పునమయిలేపోదరాయ్,
శుఱ్ఱత్తుద్తోఴిమారెల్లారుమ్వన్దు, నిన్
ముఱ్ఱమ్పుగున్దు ముగిల్వణ్ణన్ పేర్ పాడ,
చిఱ్ఱాదే పేశాదే శెల్వప్పెణ్డాట్టినీ,
ఎఱ్ఱుక్కుఱఙ్గుమ్పొరుళేలో రెమ్బావాయ్, 11

  

కనైత్తిళఙ్గఱ్ఱెరుమైకన్ఱుక్కిరఙ్గి,
నినైత్తుములైవఴియేనిన్ఱుపాల్ శోర,
ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్నఱ్చెల్వన్ఱఙ్గాయ్,
పనిత్తలైవీఴ నిన్వాశల్ కడైపఱ్ఱి,
శినత్తినాల్ తెన్నిలఙ్గైక్కోమానైచ్చెఱ్ఱ,
మనత్తుక్కినియానైప్పాడవుమ్నీవాయ్తిఱడాయ్,
ఇనిత్తానెఴున్దిరాయీదెన్న పేరుఱక్కమ్,
ఆనైత్తిల్లత్తారుమఱిన్దేలో రెమ్బావాయ్. 12



సీ॥ క్రేపులతోఁగూడి యేపున నావులు
గుమిగొని క్షీరముల్ గ్రుమ్మరింప,
పగతురునశియింపఁ బటుయుద్ధములొనర్చు
వరగోపవంశసువర్ణలతిక!
వల్మీకఫణిఫణాపరిణాహిసుజఘన!
మృద్వంగి! బర్హిసదృశశిరోజ!
లేచిరావే! ఎల్లరిచక్కి నీయింటి
వాకిట నీలాంగుఁ బాడుచుండ,

గీ॥ కదిలిమెదలక మాటాడక యిదియేమె?
సంపదలఁదేలియాడెడి సారసాక్షి!
ఏలనే యింతనిద్దురఁదేలుచుంట?
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 11

సీ॥ కట్టినదూడలఁ గనుఁగొని యఱచుచు
యవి కుడ్చుచుండినయటుల నెంచి,
స్తనమార్గములఁ బాలుస్రవియించి, బురదగా
నొనరించు నెనుములఁ బెనుచునతని
సోదరీ! తలను మంచు గురియుచుండుట
చూరుబట్టియు వ్రేలుచున్నవార
మల లంకరెడయని హరియించినమహాత్ము
మానసప్రియు రాము మఱియుఁబాడ

గీ॥ నోరుతెరువకయుండెద వౌర యేల?
ఇంకనేనియు లేలె మ్మిదేమినిదుర?
అందఱుహసింప నిద్దురఁజెందెదేమి?
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 12

పుళ్ళిౝవాయ్కీణ్డానై ప్పొల్లావరక్కనై,
కిళ్ళిక్కళైన్దానై క్కీర్తిమై పాడిప్పోయ్,
ప్పిళ్ళైగళెల్లారుమ్పావై క్కళమ్బుక్కార్,
వెళ్ళి యెఴున్దు వియాఴముఱఙ్గిఱ్ఱు,
పుళ్ళుమ్శిలుమ్బినగాణ్ పోదరిక్కణ్ణినాయ్,
కుళ్ళక్కుళిరక్కుడైన్దునీరాడాదే,
పళ్ళిక్కిడత్తియోపావాయ్నీనన్నాళాల్,
కళ్ళన్దవిర్న్దు కలన్దేలో రెమ్బావాయ్. 13

  

ఉఙ్గళ్ పుఴైక్కడై త్తోట్టత్తువావియుళ్,
శెఙ్గఴునీర్ వాయ్ నెగిఴ్న్దామ్బల్ వాయ్కూమ్బినగాణ్,
శెఙ్గఱ్పొడిక్కూఱై వెణ్బఱ్ఱవ త్తవర్,
తఙ్గళ్ తిరుక్కోయిల్ శఙ్గిడువాౝ పోదన్దార్,
ఎఙ్గళై మున్న మెఴుప్పువాౝ వాయ్ పేశుమ్,
నఙ్గా యెఴున్దిరాయ్ నాణాదాయ్ నావుడై యాయ్.
శఙ్గొడు శక్కర మేన్దుదడక్కైయౝ,
పఙ్గయక్కణ్ణానై ప్పాడేలో రెమ్బావాయ్. 14



సీ॥ బకునినోటినిజీల్చి పరిమార్చి, రావణు
గిల్లివైచినవాని కీర్తివిధముఁ
బాడుచుంటిమి, చిన్నిపడుచులు మునుమున్న
గమ్యస్థలముఁజేరఁగా నటిగిరి,
శుక్రుఁడు నుదయించె, శుభగురుఁడు గమించె,
పక్షులు కూయుచుఁ బాఱఁదొడఁగె,
కమలాక్షి! మృదుభావ! ఘనపుణ్యదినమున
చల్లఁగా స్నానముసలుపరాక

గీ॥ పండి నిదురించుచుండుట పాడియగునె?
కపటమును వీడి మాతోడఁ గలసివచ్చి,
యనుభవింపంగఁ గాంచుమా యలఘుఫలము
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 13

సీ॥ మీతోటకొలనిలో మేటిచెంగలువలు
తమివిచ్చె, ముకుళించెఁ గుముదచయము,
కాషాయవర్ణసంఘటితాంబరము గట్టి
ధౌతదంతులు తపోధనులు నదిగొ
తమతమనెలవులఁ దరియఁబోవుచునుండ్రి,
యోపిక మము ముందు లేపెదనని
మాటఁదప్పియు సిగ్గుమదిని బొందనిదాన!
లేచిరమ్మా గుణాళిపరిపూర్ణ!

గీ॥ సురసనా! శంఖచక్రసంశోభితకరుఁ
బుండరీకాక్షుఁ బాడ నిప్పుడు రయమునఁ
బిలుచుచున్నాము నిను. బయల్ వెడలిరమ్మ.
తగిన మననోమునోమంగఁ దరలిరండు. 14

ఎల్లేయిళఙ్గిళియేయిన్న ముఱఙ్గుదియో,
శిల్లెన్ఱఴై యేన్మిన్నఙ్గైమీర్ పోదరుగిన్ఱేన్,
వల్లైయున్ కట్టురైగళ్ పణ్డేయున్ వాయఱిదుమ్,
వల్లీర్గళ్ నీఙ్గళేనానేదానాయిడుగ,
ఒల్లై నీపోదాయునక్కెన్న వేఱుడైయై.
ఎల్లారుమ్బోన్దారోపోన్దార్ పోన్దెణ్ణిక్కొళ్,
వల్లానై కొన్ఱానై మాఱ్ఱారై మాఱ్ఱఴిక్క,
వల్లానై, మాయనైప్పాడేలో రెమ్బావాయ్. 15

  

నాయగనాయ్నిన్ఱనన్దగోపనుడైయ
కోయిల్ కాప్పానే, కొడిత్తోన్ఱుమ్ తోరణ
వాశల్ కాప్పానే, మణిక్కదవన్దాళ్ తిఱవాయ్,
ఆయర్ శిఱుమియరోము క్కఱైపఱై,
మాయన్ మణివణ్ణన్ నెన్నలేవాయ్నేర్ న్దాన్.
తూయోమాయ్వన్దోమ్తుయిలెఴప్పాడువాన్,
వాయాల్ మున్న మున్నమ్మాఱ్ఱాదేయమ్మానీ,
నేశనిలైక్కదవమ్నీక్కేలో రెమ్బావాయ్. 16



గీ॥ అహహా! తీయనిమాటలాడెడుచిలుకఁ! నీ
వింకను నిదురలోనే నిలచితె? -
వేగఁబిల్వకుఁడు — పెన్నారవైతివిదేమె? -
మీరె — వచ్చుచునుంటినౌర - యిదిగో!
విజ్ఞురాలవు నీదుపెద్దనోరు దెలియు —
మీరె వాక్సరణిలో మించువారు.
దోషంబు నాపైనె ద్రోసికొందునన్నైన -
చాన నీకొకప్రయోజనము గలదె? —

గీ॥ ఎల్లరునువచ్చిరా? — వచ్చిరెంచికొనుము,
గజముఁ బరిమార్చి, శత్రులగర్వమడఁచు
నద్భుతగుణాఢ్యుఁ బాడ మాయందునిలుము,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 15

సీ॥ ఒడయఁడౌ నందునియురుగృహద్వారంబుఁ
గాయువాఁడా! ధ్వజకలితమగుచు
తోరణాల్ గట్టిన చేరువవాకిలి
రక్షించువాఁడ, ఈరత్నఘటిత
దృఢకవాటంబునుఁ దీయుమా గడెయూడ్చి,
నిన్ననే బాల్యమందున్నమాకు
మణికాంతిదేహుండు మాయి మాటనొసంగె
మంచివాద్యము లిత్తునంచు నెంతొ,

గీ॥ శుద్ధిగావచ్చితిమి, నిద్రయుద్ధతిసెడ
పాడఁగా వచ్చితిమి స్వామివచనరీతి,
నడ్డకే వాకిటిని దీయవయ్యా నీవె,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 16

అమ్బర మేత్తణ్ణీ రేశో రేయఅఞ్జెయ్యుమ్,
ఎమ్బెరుమాౝనన్దగోపాలా వెழுన్దిరాయ్,
కొమ్బనా ర్కెల్లామ్కొழுన్దేకులవిళక్కే,
ఎమ్బెరుమాట్టియశోదాయఱివుఱాయ్,
అమ్బరమూడఱుత్తోఙ్గియుళగళన్ద,
ఉమ్బర్ కోమా నేయుఅఙ్గా దెழுన్దిరాయ్,
శెమ్బొఱ్కழలడిచ్చెల్వాబలదేవా,
ఉమ్బియుమ్నీయుముఅఙ్గలో రెమ్బావాయ్, 17

  

ఉన్దుమదగళిన్ఱన్నోడాదతోళ్ వలియౝ,
నన్దగోపాలౝమరుమగళేనప్పిన్నాయ్,
కన్దఙ్గమழுమ్కుழలీకడై తిఱవాయ్,
వన్దెఙ్గుమ్కోழிయழைత్తనగాణ్, మాదవి
ప్పన్దల్ మేల్ పల్ కాల్ కుయలినఙ్గళ్ కూవినగాణ్,
పన్దార్ విరలియుౝమైత్తునౝపేర్ పాడ,
చ్చెన్దామరై క్కైయాల్ శీరార్ వళై యొలిప్ప,
వన్దుతిఱవాయ్మగిழ்న్దేలో రెమ్బావాయ్. 18



సీ॥ వస్త్రముల్ శీతలవారియు నన్నము
ధర్మచింతనతోడ దానమొసఁగు
మాపాలకుఁడ! నందగోపాల! లేలెమ్ము,
రమణీమణీ! కులరత్నదీప
మా! రాణి! యోయశోదా! రవ్వమేల్కొమ్ము
సురపథంబును తూటుపఱచిపెరిగి
సకలజగంబుల సరిగాఁగఁగొలుచుట
సకలదేవతల కీశ్వరుఁడవైన

గీ॥ వాఁడ! మేల్కొమ్ము; నిద్దపుఁబైడియందె
పదమునందొడిగిన బలభద్ర! నీదు
ననుజుఁడును నీవుమేల్కొనుఁడయ్య యింక,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 17

సీ॥ మత్తమతంగజమహనీయవీర్యుఁడు
వెనుదీయ నెఱుఁగని ఘనభుజములు
గలిగిన నందుకోడల! విసర్పద్గంధ
బంధురధమ్మిల్లభార! నీళ!
తలుపుతీయుము, కోళ్లు నెలమి నెల్లెడలను
కొక్కొరోకోయని కూయఁదొడఁగె,
గురివెందపందిటఁ గూడి నిద్రించెడి
కోయిలమొత్తముల్ గొసరిపాడె,

గీ॥ కందుకాలంకృతాంగుళీ! కాంతుపేరు
పాడఁ, గంకణములుమ్రోగఁ దోడవచ్చి,
యెఱ్ఱఁదామరచేతఁ దల్పిఁకఁదెరువుము,
తగిన మననోము నోమంగఁ దరలిరండు, 18

కుత్తువిళక్కెరియక్కోట్టుక్కాల్ కట్టిల్ మేల్,
మెత్తెన్ఱపఞ్జశయనత్తిన్ మేలేఱి,
కొత్తలర్ పూఙ్గుఴల్ నప్పిన్నైకొఙ్గైమేల్,
వైత్తుక్కిడన్దమలర్ మార్బా వాయ్‌తిఱవాయ్,
మైత్తడఙ్గణ్ణినాయ్‌నీయున్మణాళనై,
ఎత్తనై పోదుమ్‌తుయిలెఴవొట్టాయ్‌గాణ్,
ఎత్తనై యేలుమ్‌పిరివాఱ్ఱగిల్లాయాల్,
తత్తువమన్ఱుతగవేలోరెమ్బావాయ్. 19

  

ముప్పత్తుమూవరమరర్క్కుమున్శెన్ఱు,
కప్పన్దవిర్క్కుమ్‌కలియేతుయిలెఴాయ్,
శెప్పముడైయాయ్‌తిఱలుడైయాయ్, శెఱ్ఱార్క్కు
వెప్పఙ్గొడుక్కుమ్‌విమలాతుయిలెఴాయ్,
శెప్పన్న మెన్ములై చ్చెవ్వాయ్‌చ్చిఱుమరుఙ్గుల్,
నప్పిన్నైనఙ్గాయ్‌తిరువేతుయిలెఴాయ్,
ఉక్కముమ్‌తట్టొళియుమ్ తన్దున్మణాళనై,
ఇప్పోదేయెమ్మైనీరాట్టేలోరెమ్బావాయ్. 20



సీ॥ దీపపుకంబమం దేపున దీవియల్
జ్వలియింప, గజదంతశయనమునను
మెత్తనై బహుగుణమిళితమౌ పరపుపై
కెక్కి, విచ్చినపూవులిడిన తురుము
దనరు నప్పిన్నకొంగునఁ బండిన ముకుంద!
పద్మవక్షా! నోటఁ బలుకుమయ్య!
అంజనాలంకృతహారిలోచన! ఇంక
నెంతకాలము ప్రియు నిటులనిదుర

గీ॥ లేవఁగానీవు? కాంతుఁడులేక క్షణము
నోర్వలేకుంట యాశ్చర్య మొదవజేయు,
న్యాయమునుగాదు, తగదిది యతివనీకు,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 19

సీ॥ ముప్పదిమూఁడుకోట్లొప్పినసురలలో
నగ్రేసరత భయ మణఁచువాఁడ!
సర్వశక్తియుతుండ! సరగను మేల్కొమ్మ,
ఋజుబుద్ధితోడ నాశ్రితులయరుల
దుఃఖాగ్నిఁద్రోఁచెడి దురితహరా! లెమ్మ,
బింబోష్ఠి! తామ్రకుంభితకుచాఢ్య!
యణుమధ్య! లక్ష్మీసమా! నీళ! మేల్కొమ్మ,
ఆలవట్టము నద్ద మలరనిమ్మ,

గీ॥ నీపతినిమాకునర్పించి నిపుణముగమ
నందఱిని మము నీరాడునటు లొనర్చి
నీవు ర మ్మంత మాతోడనే కలియఁగ
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 20

ఏఱ్ఱకలఙ్గళెదిర్ పొఙ్గిమీదళిప్ప,
మాఱ్ఱాదేపాల్ శొరియుమ్వళ్ళల్పెరుమ్బశుక్కళ్,
ఆఱ్ఱప్పడైత్తాన్మగనేయఱివుఱాయ్,
ఊఱ్ఱముడైయాయ్ పెరియా, యులగినిల్
తోఱ్ఱమాయ్నిన్ఱశుడరేతుయిలెఴాయ్,
మాఱ్ఱారునక్కు వలితులైన్దున్ వాశఱ్కణ్
ఆఱ్ఱాదువన్దున్నడిపణియుమాప్పోలే,
పోఱ్ఱి యామ్వన్దోమ్పుగఴ్న్దేలోరెమ్బావాయ్. 21

  

అఙ్గణ్ మాఞాలత్తరశరబిమాన,
పఙ్గమాయ్వన్దునిన్ పళ్ళిక్కట్టిఱ్కీఴే,
శఙ్గమిరుప్పార్ పోల్ వన్దుతలైప్పెయ్దోమ్,
కిఙ్గిణివాయ్చ్చెయ్దతామరైప్పూప్పోలే,
శెఙ్గణ్ శిఱిచ్చిఱిదే యెమ్మేల్ విఴియావో,
తిఙ్గళుమాదిత్తియనుమెఴున్దాఱ్పోల్,
అఙ్గణిరణ్డుఙ్గొణ్డెఙ్గళ్ మేల్ నోక్కుదియేల్,
ఎఙ్గళ్ మేశ్శాబమిఴిన్దేలోరెమ్బావాయ్. 22



సీ॥ పాల్ పొంగిపోకుండ బాగుగనిడిన బా
నలుపొర్లఁ బాలిచ్చు నాలుగలుగు
నందగోపుని ప్రియనందనా! మేల్కొమ్మ,
శ్రితపక్ష! నిదురచాలించి రమ్మ,
భువికిడిగ్గిన మహాపూరుషా! మేల్కొమ్మ,
జ్యోతిర్మయాకార! సొరిది లెమ్మ,
పరిపంథులు త్వదీయపటుపరాక్రమవిభా
విజితులై వాకిట వేచియుండి

గీ॥ నీదుచరణంబులను గొల్వ నిలుచురీతి
సంతసముఁజెంది మంగళాశాసనంబు
జరుప మేమెల్లవచ్చితి మరయ నిటకు
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 21

సీ॥ సుందర భూభాగమందున్నవైరులు
గర్వము భగ్నమై కడకుఁదొలఁగ
నీపాదపీఠికి నోపిక మ్రొక్కఁన
క్లేమ మీయండఁ గాంక్షించినాము,
అలరుమువ్వలవలె నరవిచ్చి యరవింద
కుసుమవిధంబునఁ గొమరుమిగులు
నిద్రారుణితనేత్రభద్రప్రసారంబు
మెల్లఁగ మాపైని జల్లరాద,

గీ॥ చంద్రసూర్యులు నుదయించుసొరుమీరు
నయనయుగమున మవీక్షణము సలిపిన
మమ్మలముకొన్న దురితముల్ మ్రగ్గిపోవు,
తగిన మననోము నోమంగఁ దరలిరండు, 22

మారిమలై ముఴైఞ్జిల్ మన్నిక్కిడన్దుఱఙ్గుమ్.
శీరియశిఙ్గమఱివుఱ్ఱుత్తీవిఴిత్తు,
వేరిమయిర్ పొఙ్గవెప్పాడుమ్ పేర్న్దుదఱి,
మూరినిమిర్న్దుముఴఙ్గిప్పుఱప్పట్టు,
పోదరుమాపోలేనీపూవై ప్పూవణ్ణా, ఉన్
కోయిల్ నిన్ఱిఙ్ఙనేపోన్దరుళి, కోప్పుడైయ
శీరియశిఙ్గాశనత్తిరున్దు. యామ్వన్ద
కారియ మారాయ్న్దరుళేలో రెమ్బావాయ్. 23

  

అన్ఱివ్వులగమళన్దాయడిపోఱ్ఱి
శెన్ఱఙ్గుత్తెన్నిలఙ్గైశెఱ్ఱాయ్తిఱల్ పోఱ్ఱి
పొన్ఱచ్చగడముదైత్తాయ్పుగఴ్పోఱ్ఱి
కన్ఱుకుణిలా వెఱిన్దాయ్కఴల్ పోఱ్ఱి
కున్ఱుకుడైయా వెడుత్తాయ్ గుణమ్పోఱ్ఱి
వెన్ఱుపగై కెడుక్కుమ్నిన్కైయిల్ వేల్ పోఱ్ఱి
ఎన్ఱెన్ఱున్ శేవగమే యేత్తిప్పఱైకొళ్వాన్,
ఇన్ఱుయామ్వన్దోమిరఙ్గేలో రెమ్బావాయ్. 24



సీ॥ బహుళవర్షావేళఁ బర్వతగుహాలోన
గాఢసుషుప్తినిఁ గాంచుచుండు
సింహరాజము తెల్విఁజెంది, కన్నులువిచ్చి,
చెదరినజూలును చెలఁగినిక్క
నొడలువిదల్చి పైనొకకొంత మేన్సాచి
గర్జించి వెలువడుగతిని నీవు
అతసీగుళుచ్ఛదేహ తమయాస్థాన
మంటపముననుండి మఱియిచటికి

గీ॥ వచ్చి, యతులావయవశోభ మెచ్చఁదగిన
యలఘుసింహాసనమున నెయ్యమున నిలిచి
యేమువచ్చినపని విచారించిప్రోవు
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 23

సీ॥ దివిషదుల్ ప్రార్థింప భువనముల్ గొలుచుఁ
మంజుపాదములకు మంగళంబు,
లంకలోని యసురులను బలిగొన్న నీ
మహనీయశక్తికి మంగళంబు,
అంతనాఁడే శకటాసురుఁ గూల్చు నీ
మాన్యమౌకీర్తికి మంగళంబు,
వత్సాసురుని బంతివలెఁ జిమ్మినట్టి నీ
రంగదంఘ్రులకును మంగళంబు.

గీ॥ పర్వతచ్ఛత్ర మొత్తిన పటుకరుణకు,
శాత్రవులఁద్రుంచు నీచేతిశస్త్రమునకు,
మంగళమటంచుఁ జేరిన మమ్ముఁబ్రోవు,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 24

ఒరుత్తిమగనాయ్ప్పిఱన్దోరిరవిల్,
ఒరుత్తిమగనా యొళిత్తువళర,
త్తరిక్కిలానాగిత్తాఞ్ తీఙ్గునినైన్ద,
కరుత్తైప్పిఴైప్పిత్తుక్కఞ్జన్ వయిఱ్ఱిల్,
నెరుప్పెన్న నిన్ఱనెడుమాలే, యున్నై
యరుత్తిత్తువన్దోమ్పఱై తరుదియాగిల్,
తిరుత్తక్క శెల్వముమ్ శేవగముమ్ యామ్పాడి,
వరుత్తముమ్దీర్ న్దుమగిఴ్న్దేలో రెమ్బావాయ్. 25

  

మాలేమణివణ్ణామార్గఴినీరాడువాఞ్,
మేలైయార్ శెయ్వనగళ్ వేణ్డువనకేట్టియేల్,
ఞాలత్తై యెల్లామ్నడుఙ్గమురల్వన,
పాలన్న వణ్ణత్తుఞ్ పాఞ్జశన్నియమే,
పోల్వనశఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడై యనవే,
శాలప్పెరుమ్బఱై యేపల్లాణ్డిశై ప్పారే,
కోలవిళక్కే కొడియేవిదానమే,
ఆలినిలై యా యరుళేలో రెమ్బావాయ్. 26



సీ॥ ఒకరికి సుతుఁడవై, యొకరాత్రిలోన నిం
కొకరికి బిడ్డవై యుండి పెరుగ,
విని సహింపక హింసయొనరుప నెంచిన
యోచనల్ వైయర్థ్యమొందఁజేసి,
కంసుని కడుపులో ఘనవహ్నివలెనుంటి
వాశ్రితపరతంత్రుఁడైన నీవు,
అట్టినిన్ పురుషార్థమర్థింపగా నెంచి
మే మెల్లరము వచ్చినాము తలఁప,

గీ॥ అస్మదీయేష్టము లొసంగినట్టులైన
పద్మజార్హ సంపద వీర్యపటిమఁ బొగడి
మానసవ్యథ మాని ప్రేమముగొనెదము
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 25

సీ॥ ఆశ్రితులకు మోహమావహింపఁగజేయు
నింద్రనీలోపలాయితశరీర,
ఘనధనుర్మాసావగాహనాంగములుగాఁ
బెద్దలుగైగొన్న పద్దులు విను,
భూమియంతయుఁ గంపముంబొంద శబ్దించు
శంఖముల్ త్వచ్ఛంఖసదృశ్యములును,
పటువిస్తృతశ్లాఘ్యపటహముల్ పెక్కులు,
మంగళంబులుఁబాడు మనుజవరుల

గీ॥ మేటిదివ్వెలు టెక్కెముల్ మేలుకట్లు
వటదళంబున శయనించువాఁడ! కృష్ణ!
కరుణతో మాకు నిప్పించి కావవలయుఁ
దగిన మననోము నోమంగఁ దరలిరండు. 26

కూడారై వెల్లుమ్ శీర్గోవిన్దా, పున్ఱన్నై
ప్పాడిప్పఱై కొణ్డుయామ్బెఱుశమ్మానమ్,
నాడుపుగఴుమ్పరిశినాల్ నన్ఱాగ,
చ్చూడగమేతోళ్వళై యేతోడేశెవిప్పూవే.
పాడగమే యెన్ఱనై యపల్ కలనుమ్ యామణివోమ్.
ఆడై యుడుప్పోమదన్పిన్నే పాఱ్చోఱు,
మూడనెయ్ పెయ్దుముఴఙ్గైవఴివార,
క్కూడియిరున్దుకుళిర్న్దేలో రెమ్బావాయ్. 27

  

కఱవైగళ్ పిన్శెన్ఱుకానమ్ శేర్న్దుణ్బోమ్,
అఱివొన్ఱుమిల్లాదవాయ్క్కుల, త్తున్ఱన్నై
ప్పిఱవిపెఱున్దనై పుణ్ణియమ్ యాముడై యోమ్,
కుఱై వొన్ఱుమిల్లాదగోవిన్దా, వున్ఱన్నో
డుఱవేల్ నమక్కిఙ్గొఴిక్కవొఴియాదు,
అఱియాదపిళ్ళైగళోమన్బినా, లున్ఱన్నై
చ్చిఱుపేరఴైత్తనవుమ్శీఱియరుళాదే,
ఇఱైవానీతారాయ్పఱై యేలో రెమ్బావాయ్. 28

సీ॥ కూడనివైరులఁ గొమరొప్ప దండించు
గోవింద! నినుఁ బాడికొనుచు నెపుడు
వాద్యముల్ గాని మేము వరగౌరవముఁగాంచి
జగమంతయును స్తుతుల్ సలుపుచుండ
శ్రేష్ఠతమంబులై చెలఁగు కంకణములు,
నంగదాల్, కమ్మలు, నందె, లటులె
చెవిపూలు మొదలగు వివిధాభరణములు,
కోకలు ధరియించుకొనెడునటులఁ

గీ॥ జేసి, క్షీరాన్నమున నేయి చిప్పిలఁగను
జేర్చి, మీరును మేమును జేరి, నేయి
మోచెయికిఁగారఁ భుజియింప మోదమొదవు,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 27

సీ॥ ఆవులవెనువెంట నడవులకును జని
జీవనంబు గమింపఁజేయు మేము
తెలివితక్కువ గొల్లకులమున మీతోడఁ
బుట్టి పొందితి మర్థపుణ్యాచయము,
కొదువయొండునులేని గోవిందుఁడా! మాకు
మీపొత్తెపుడు విరమింపఁదగదు,
జ్ఞానమింతయులేక చాలచిన్నతనంబు
నందున్న పడుచులమయ్య మేము,

గీ॥ భక్తిభావముచే ననురక్తిమించి
చిన్నిమాటలఁ బిలిచితిమన్న దాన
కసరుకొనఁబోక ప్రాప్య మొక్కపరి యిమ్ము,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 28

శిఱ్ఱమ్ శిఱుకాలేవన్దున్నై చ్చేవి, త్తున్
పొఱ్ఱామరై యడియే పోఱ్ఱుమ్పొరుళ్ కేళాయ్,
పెఱ్ఱమ్మేయ్త్తుణ్ణుమ్కులత్తిఱ్పిఱన్దు, నీ
కుఱ్ఱేవలెఙ్గళై కొళ్ళామ ఱ్పోగాదు.
ఇఱ్ఱైప్పఱై కొళ్వానన్ఱుగాణ్ గోవిన్దా,
ఎఱ్ఱైక్కు మేఴ్ఴు పిఱవిక్కు, మున్దన్నో
డుఱ్ఱోమేయావోమునక్కే నామా ట్చెయ్వోమ్,
మఱ్ఱైనఙ్గామఙ్గళ్ మాఱ్ఱేలో రెమ్బావాయ్.

  

వఙ్గక్కడల్ కడైన్దమాదవనై క్కేశవనై,
త్తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిఴైయార్ శెన్ఱిఱైఞ్జి
అఙ్గప్పఱైకొణ్డవాఱ్ఱై, యణిపుదువై
పైఙ్గమలత్తణ్డెరియ ఱ్పట్టర్పిరాన్ కోదై శొన్న,
శఙ్గత్తమిఴ్మాలై ముప్పదున్దప్పామే,
ఇఙ్గిప్పరిశురైప్పారీరిరణ్డుమాల్వరైత్తోళ్,
శెఙ్గట్టిరుముగత్తుచ్చెల్వ త్తిరుమాలాల్,
ఎఙ్గుమ్తిరువరుళ్ పెఱ్ఱిన్బుఱువ రెమ్బావాయ్.

ఆణ్డాళ్ తిరువడిగళే శరణమ్.

సీ॥ ఎంతో వేకువనె నీ చెంతఁజేరియు మ్రొక్కి
కమలామలాంఘ్రుల గాంచి యెపుడు
మంగళాశాసనముం గూర్చు భావంబు
వినుము, గోవుల మేసికొనుచుఁ బ్రతుకు
జాతిఁ బుట్టిననీవు సర్వకైంకర్యముల్
మాచేఁ గొనకయుంట మంచిదగునె?
గోవింద! యిపు డొకకోరికతో రాము,
కాలతత్త్వం బుండు వేళవఱకు,

గీ॥ పరగ నేడేడుజన్మలవఱకు నెపుడు
మే మనన్యార్హభావన మించియుండి,
తమ్మె సేవింతు, మన్యకామమ్ము లుడుపు,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 29

సీ॥ పరిపూర్ణవారాశి నెటిఁజిక్కిన రమేశు
కేశవుఁ జంద్రముఖీవతంస
లలఘురత్నాభరణాంచితలై వచ్చి,
కొనియాడి ప్రాప్యముం గొనినరీతి,
శ్రీవిల్లిపుత్తూరఁ జెందామరలమాల
ల నొసంగు విష్ణుచిత్తునితనూజ
యరవబాసను గూర్చినట్టి యీముప్పది
పాటలు దప్పక పాడువారు

గీ॥ నాల్గుభుజపర్వతంబుల వెల్గుచుండి,
రక్తనేత్రాంతమౌ ముఖలక్ష్మి యొప్పు
లక్ష్మిపతికృప సౌఖ్యము గ్గాంచఁగలరు,
తగిన మననోము నోమంగఁ దరలిరండు. 30

ఆండాళ్ తిరువడిగళే శరణం.

# తప్పొప్పుల పట్టిక.

| తప్పు. | ఒప్పు. |
|---|---|
| మన్నిశయాల్ | మిన్నిశయాల్ |
| మృర్ద్నే | మగిృర్ద్నే |
| శారజ్ఞ | శార్జ్ఞ |
| కుశీర్ ద్నే | కుశిర్ ద్నే |
| యఅవు | యఅపు |
| కూ్కవాఁ | కూ్కవువాఁ |
| ద్దరుశ | ద్దరుశ |
| తెపుదప్ప | తెవుదప్ప |
| తేగ్రిఊమాంయ్ | తేగ్రిగ్రమాంయ్ |
| శుగ్రిగ్రత్తుద్తో | శుగ్రిగ్రత్తుత్తో |
| చ్చిగ్రిగ్రదే | చ్చిగ్రిగ్రాదే |
| ముతై వఱియే, సొర | ముతై వృఱియే, శో. |
| ప్పాడపుం | ప్పాడవుం |
| తిఅడాంయ్ | తిఅవాంయ్ |
| రెమ్యాబనాంయ్ | రెమ్యాబవాంయ్ |
| నీవు | యీావు |
| త్వదీయు | త్వడీయ |
| అజ్ఞుమ్ | అజ్ఞుమ్ |
| వచ్చినీపని | వచ్చినపని |
| గొలుచుఁ | గొలుచునీ |
| పెరుప్పెన్న | నెరుప్పెన్న |
| కడుపులో | కడుపులో |
| అట్టినిర్ వు | అట్టినిఁ పు |
| సదృశ్య | సదృశ |
| టికె్కముల్ | టెకె్కముల్ |
| పుష్పనై్ఞ | వుష్పనై్ఞ |
| మగ్రినొగొస | మగ్రిణాగ్రిన |
| అజ్ఞ | అజ్ఞ |
| ముప్పదు | ముప్పదు |
| మేసికొనుచ | మేపికొనుచు |

# విజ్ఞప్తి

---

సారస్వతాభిమానులారా,

ఈ గ్రంథమాలయందు సారస్వతభక్తి జ్ఞాన ధర్మప్రోత్సాహకరములగు స్వకీయపరకీయగ్రంథములును, ప్రాచీనములును నవీనములును ప్రచురింపఁ బూనుకొంటిని. తమ యాదరముచే నీ రెండవ కుసుమము వెలువడినది. "స్తోత్రమంజరి" మూఁడవకుసుమముగా వెలువడనున్నది. ఉదారులగువారు చందారూపముగను సహాయరూపముగను తోడ్పడి యీసత్కార్యమునకు చేయూతనొసఁగ వేడుచున్నాను.

యావజ్జీవ సభ్యులు

| | |
|---|---|
| మహారాజపోషకులు | 100—0—0 |
| రాజపోషకులు | 50—0—0 |
| పోషకులు | 25—0—0 |

వార్షిక సభ్యులు

| | |
|---|---|
| ప్రోత్సాహకులు | 10—0—0 |
| అభిమానులు | 5—0—0 |
| సాధారణసభ్యులు | 1—0—0 |

సంవత్సరమునకు 100 పుటలకుతగ్గని వాఙ్మయము సభ్యులకు సమర్పింపబడును. వెంటనే మీయాదరమునకుఁదగిన చందానంపి చేయూత నొసంగవేడుచున్నాను.

ఇట్లు
బుధవిధేయుడు